# జ్యోతిశ్చక్ర సారాంశము

కృత్తికకగ్ని, రోహిణికి బ్రహ్మ, మృగశీర్షకు చంద్రుడు, ఆర్ద్రకీశుడు, పునర్వసుకదితి, పుష్యమికి గురుడు, ఆశ్లేషకు సర్పములు, మఘకు పితరలు, పూర్వఫల్గునికి భగనామకుడు, ఉత్తరకర్యముడు, హస్తకు రవి, చిత్తకు త్వష్ట. స్వాతికి వాయువు, విశాఖకింద్రాగ్నులు, అనూరాధకు మిత్రుడు, జ్యేష్ఠకింద్రుడు, మూలకసురులు, పూర్వాషాఢ కంబువులు, ఉత్తరాషాఢకు విశ్వేదేవతలు, అభిజిత్తునకు బ్రహ్మ, శ్రవణమునకు విష్ణువు, ధనిష్ఠకు వసువులు, శతభిషమునకు వరుణుడు, పూర్వాభాద్రకజపతము, ఉత్తరాభాద్రకహిర్బుధ్నుడు, రేవతికి పూష, అశ్వినికశ్వినులు, భరణికి యముడు, ఇట్లు నక్షత్రాధిపతులు వీరి నామములా నక్షత్రములకు జెల్లును.

ప్రతిపన్నవమి తిథులను బ్రహ్మాణి పూర్వదిశనుండును. ద్వితీయా దశములను ఉత్తరమందు మాహేశ్వరి, తృతీయేకాదశుల నాజ్ఞేయమున కౌమారి, చతుర్థి ద్వాదశులను నైఋతియందు నారాయణి, పంచమీ త్రయోదశులను దక్షిణమున వారాహి, షష్ఠి చతుర్దశులను పశ్చిమమం దింద్రాణి, సప్తమీ పూర్ణిమలను వాయుకోణమందు చాముండ ఆయాయి దేవతలకు సంముఖముగ గమనము యోగ్యము.

అశ్విన్యనూరాధా రేవతీమృగశీర్షా మూలా పునర్వసూ జ్యేష్ఠా పుష్యహస్తా నక్షత్రములు ప్రయాణయోగ్యములు. హస్తాదిపంచక ముత్తరత్రయ మశ్వనీ రోహిణీ పుష్య ధనిష్ఠా పునర్వసులు వస్త్రధారణ యోగ్యములు. కృత్తికాభరణ్యాశ్లేషా మూలా విశాఖా పూర్వత్రయములధోముఖనక్షత్రములు వీటియందు వాపీకూపతటాక తృణచ్ఛేదన దేవాగార నిధానఖనన గణిత జ్యోతిషారంభ ధనసంగ్రహ బిలప్రవేశములు చేయదగును.

రేవత్యశ్వని చిత్రా స్వాతీ హస్తా పునర్వస్వనూరాధా మృగశీర్ష జ్యేష్ఠా నక్షత్రములు పార్శ్వముఖములు వీటియందు గజోష్ట్ర మేష వృషభ మహిష శిక్షలును బీజావాపన గమనాగమన చక్రయంత్ర గజరథారోహణములు నింక పార్శ్వముందు జేయదగిన గర్మలన్నిటికిని యోగ్యములు.

రోహిణ్యార్ద్ర ధనిష్ఠోత్తర త్రయశతతారా శ్రవణములూర్ధ్వముఖనక్షత్రములు వీటియందు రాజ్యాభిషేకమును పట్టబంధమును ఊర్ధ్వముఖముగ నెత్తదగిన కార్యములన్నియును జేయదగును.

చతుర్థి, షష్ఠి, అష్టమి, నవమి, అమావాస్య, పూర్ణిమ, ద్వాదశి, చతుర్దశి యీతిథుల శుభప్రదములు.

పాడ్యమీ శుక్రవారము, విదియా సోమవారము, తదియా మంగళవారము, చవితీ శనివారము, పంచమీ గురువారము, షష్ఠీ కుజశుక్రవారములు, సప్తమీ బుధవారము, అష్టమీ కుజభానువారములు, నవమీ సోమశనివారములు, దశమీ గురువారము, ఏకాదశీ గురుశుక్రవారములు, ద్వాదశీ బుధవారము, త్రయోదశీ కుజశుక్రవారములు, చతుర్దశీ భానువారము, పూర్ణిమా అమావాస్యా గురువారము ఈ చెప్పిన ప్రకారము తిథివారములు గలసిన శుభకరము.

ఆదివారము ద్వాదశి, సోమవార మేకాదశి, కుజవారము దశమి, బుధవారము నవమి, గురువార మష్టమి, శుక్రవారము సప్తమి, శనివారము షష్ఠియు నిట్లు గలసిన దగ్ధయోగమగును. దీనియందు గమనాదులు వర్జింపవలయును. పాడ్యమి, నవమి, చతుర్దశి, అష్టమియు నీతిథులు బుధవారముతో గూడిన ప్రయాణము కూడదు.

షష్ఠియందు మేషకర్కాటకములు, అష్టమియందు కన్యామిథునములు, చవితియందు వృషభకుంభములు, ద్వాదశియందు మకర తులలు, దశమియందు వృశ్చికసింహములు, చతుర్దశ్యేకాదశులయందు ధనుర్మీనములు బీజావాపనమున కనుకూలములు కావు.

విశాఖా త్రితయము లాదివారమందు, పూర్వాషాఢా త్రయము సోమవారమందు, ధనిష్ఠా త్రయము కుజవారమందు, రేవతీ త్రయము బుధవారమందు, ఉత్తరాఫల్గునీ త్రయము గురువారమందు, రోహిణీ త్రయము శుక్రవారమందు, పుష్య త్రయము శనివారమందిట్లు గూడిన నుత్పాతయోగములివి మృత్యురోగకరములు.

మూలార్కవారములు, శ్రవణేందువారములు, పూర్వాభాద్రోత్తరా కుజవారములు, కృత్తికా బుధవారములు, ఆర్ద్ర పునర్వసు గురువారములు, పూర్వఫల్గుని శుక్రవారములు, స్వాతి శనివారములు గూడిన అమృతయోగములు సర్వకార్య శుభప్రదములు.

విష్కంభమందైదు గడియలు, శూలమందేడు గడియలు, గండాతిగండములయందారు, వ్యాఘాత వజ్ర వ్యతీపాత పరిఘ వైధృతులయందు తొమ్మిది. ఈ గడియలు సర్వకర్మములయందును వర్జింపవలయును.

హస్తయు ఆదివారమును పుష్యమీ గురువారము అనూరాధయు బుధవారములు రోహిణీ శనివారమును జ్యేష్ఠాబుధ సోమవారములు రేవతీశుక్రవారము జ్యేష్ఠాశ్వినులు మంగళవారము లిట్లు గలసిన యోగము సకలదోషముల నశింపజేయును.

శుక్రవారమున భరణి, సోమవారమున చిత్త, కుజవారమున నుత్తరాషాఢ, బుధవారమున ధనిష్ఠ, గురువారమున శతతార, శుక్రవారమున రోహిణి, శనివారమున రేవతి ఇవి విషయోగములు.

పుష్య, పునర్వసు, రేవతి, చిత్తా, శ్రవణ, ధనిష్ఠా, మృగాఆశ్విని, హస్తా, శతతారలయందు జాతకర్మను జేయదగును. విశాఖోత్తరాత్రయమఘార్ద్రా భరణ్యాశ్లేషకృత్తికలయందున ప్రస్థానమొనర్చిన మరణమగును.

రవికి మేషము, చంద్రునకు వృషభము, కుజునకు మకరము, బుధునకు కన్య, గురునకు కర్కాటము, శుక్రునకు మీనము, శనికి తుల, ఇవి యుచ్చస్థానములగుచున్నవి. ౭వ స్థానము నీచస్థలమని తెలియదగును.

సింహమునకు రవి, కర్కాటమునకు చంద్రుడు, మేషవృశ్చికముల కంగారకుడు, కన్యామిధునములకు బుధుడు, ధనుర్మీనములకు గురుడు, తులా వృషభములకు శుక్రుడు, మకరకుంభములకు శనియు, నధిపతులగుచున్నారు. రాహువునకు కన్య, కేతువునకు మిధునమును, గృహములని తెలియదగును.

లేడి, పాము, కోతి, పిల్లి, శ్వానము, సూకరము, పక్షులు, ముంగి, యలుక ఇవి కుడివైపుకు నడచిన యాత్రయందు శుభమగును.

తూర్పుదిక్కున బల్లి యరచిన మహాఫలము. ఆగ్నేయమున మోహసంతాపములు, యామ్యమున రోగము, నిఋతియందు కలహము, పశ్చిమమున మృష్టాన్నప్రాప్తి, వాయువ్యమున భోజనసుఖము, ఉత్తరమున కలహనాశనము, ఈశాన్యమున మరణము.

నక్క, లొట్టిపిట్ట, గాడిదె, యాత్రయందివి యెడమకేగిన శుభమగును.

బ్రాహ్మణకన్యక, శవము, శంఖభేరీధ్వనులు, మృత్తిక, వారాంగన, పూర్ణకుంభములు ఇవి యాత్రయందగపడిన శుభమగును.

ప్రత్తి యౌషధమును, నూనె, చొట్టవాడు, బొగ్గులు, పాము, తల విరియబోసికొనినవాడు, ఎఱ్ఱని పువ్వులను ధరించినవాడు, దిగంబరుడు, ప్రయాణమందగపడిన యశుభమగును.

కృత్తికాదిగ నేడు నక్షత్రములు ప్రాగ్దిశకును మఘాదిసప్తకములు, దక్షిణదిశకును, అనూరాధాదిసప్త తారకములు పశ్చిమమునకును, ధనిష్ఠాదిసప్తకముత్తరమునకును ప్రయాణమొనర్చిన శుభమొసంగును.

అశ్వనీ, రేవతీ, చిత్తా, ధనిష్ఠ అలంకారధారణమునకును ప్రశస్తము. మృగశీర్షా, చిత్ర, పుష్య, మూల, హస్తా, నక్షత్రములు కన్యాప్రదాన యాత్రాప్రతిష్ఠా కర్మలయందు శ్రేష్ఠములు.

జన్మమున ద్వితీయ్యమునను శుక్రచంద్రులు, చంద్రశుక్రగురులు తృతీయరాశిని, కుజ శని చంద్రార్క బుధులు చతుర్థమందు, శుక్రగురులు చంద్రకేతువులును పంచమమందు, శని, రవి, చంద్ర, కుజులు, షష్ఠమమందు, గురుచంద్రులు సప్తమమందు, బుధశుక్రు లష్టమమందు, గురుడు నవమమందు, రవి శని చంద్రులు దశమమందు, ఏకాదశమందన్ని గ్రహములును, బుధ శుక్రులు ద్వాదశమందిట్లుండిన శుభమిత్తురు.

సింహముతో మకరము, కన్యతో మేషము, తులతో మీనము, కుంభముతో కర్కటకము, ధనస్సుతో వృషభము, మేషముతో వృశ్చికము యీ షష్ఠాష్టకములు ప్రీతినిచ్చును. సందియము లేదు.

అభిషేకమగ్ని కార్యమును భానువారమందుత్తమము. సోమవారమం దశ్వారోహణము, గృహప్రవేశము, సేనాపత్యము, యుద్ధము, చౌర్యము, శస్త్రాభ్యాసము, కుజవారమందు, సిద్ధికార్యము, మంత్రము, యాత్ర, బుధవారమందు, పఠనము, దేవపూజారంభము,వస్త్రాద్యాభరణము, గురువారమందు, కన్యాదానము, గజారోహణము, స్త్రీసమయము, శుక్రవారమందు,స్థాప్యము, గృహప్రవేశము, గజబంధము ముఖ్యములు, శనివారమందు దూష్యములు.

ఉత్తరాయణమందు శుక్లపక్షములో పగటిప్రమాణము తొమ్మిదిభాగము లొనర్చి ౧-౩-౫-౭-౯ యీ బేసిభాగములు పుణ్యనక్షత్రసంజ్ఞికములు, సకలశుభకార్యములకును యోగ్యములు. ౨-౪--౬-౮- యీ సరిభాగముల క్లీల సంజ్ఞికములివి శుభకార్యముల కర్హములుకావు.

కొందరు కృత్తికాది విశాఖాంతమువరకు దేవనక్షత్రములనియు, పుణ్యాహములనియును, బల్కుదురు.

ఐహికాముష్మికములను గోరువారు స్వాతీనక్షత్రమందు కన్యాదానమును జేసిన యాకన్నియ భర్తకతిప్రియురాలై మరల పుట్టినింటికి రాదలంచదు. ఉత్తరాషాఢాచరమభాగమును శ్రవణ పూర్వభాగమును, గలసి యభిజిన్నక్షత్ర మగును. దీనియందు దేవతలసురులతో దలపడి జయించిరి. గావున యభిజిన్నక్షత్రమున యుద్ధయాత్రజేసిన యజేయులగు వారికైన జయింతురు.

బ్రహ్మ పశువులను రేవతీనక్షత్రమందును సృజించెను. గాన పశుసంగ్రహము రేవతీ నక్షత్రమున జేసిన యభివృద్ధి నొందును.

## దేవనిర్మిత పట్టణములు.




శ్లో॥ భూవృత్తపాదే పూర్వస్యాం । యవకోటిస్తువిశ్రుతా । భద్రాశ్వవర్షేనగరీ । స్వర్ణప్రాకారతోరణా । యామ్యాయాంభారతే వర్షేలంకాతద్వన్మహాపురీ । పశ్చిమే కేతుమాలాఖ్యారోమకాఖ్య ప్రతిష్ఠితా । ఉదక్సిద్ధపురీనామ కురువర్షేప్రతిష్ఠితా ।

## సూర్యగమనము.

భూమి గుండ్రమై వలయాకారముగా నుండునని చెప్పవలెను. కావుననే దానికి భూగోళమని పేరు. సూర్యమండల మనుటయు మీకు తెలుసును. మండల మనఁగా గోళము. అనఁగా వర్తులమై గుండ్రముగా నుండునది యని యర్థము. సూర్యుడు భూమికిని భూమియందుండు వారలకును చిన్నగోళముగాఁ గానఁబడుచున్నను, భూగోళముకన్న సూర్యగోళము యెన్నోరెట్లు పెద్దదని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. ఈభూమి ఒక బంతివలెనున్నది. ఇది సదా దొర్లుచుపోయి సూర్యునిచుట్టును తిరుగుచుండును. అది యొకసారి (ఒక చుట్టు) దొర్లుసరికి అఱువది గడియలు పట్టును. అటుల మూఁడువందలయఱువది అయిదుసార్లును (అనఁగా) ఒకటనాల్గవవంతును దొర్లఁగా నొక్కసారి సూర్యమండలము చుట్టును తిరుగును. ఇట్లు తిరుగుకాలము 365 దినముల 15 గడియ లగును. దీనికే అనఁగా భూగోళము సూర్యగోళముచుట్టును తిరిగి వచ్చుకాలమునకే సంవత్సరమని పేరు. భూమి తనపై తాను ఒక్కసారి దొర్లుతావునుండి ఒక గీత గీసితిమని భావింపుము. అటులనే ప్రతిసారియు తిరుగుతావున నొక గీత గీయుచుండిన భూమి చుట్టు సూర్యుడుయొకసారి తిరిగివచ్చుసరికి మున్నూటఅఱువదిగీత లేర్పడును. ఈగీతలన్నియు సూర్యుని చుట్టును సమదూరమున నుండును. వాని చివరలకుతగులునట్లు సూర్యుని చుట్టును ఒక గీత గీసిన ఒకవలయ మేర్పడును. దానికే కాలచక్రమందురు. ఈ కాలచక్రముననున్న 360 గీతలకే భాగములు లేక డిగ్రీలందురు. ఈ 360 డిగ్రీలను పండ్రెండు భాగములొనర్చిన, పండ్రెండురాసు లగును. ఒక్కొక్క రాశికి 30 డిగ్రీలు. సూర్యుడు చుట్టుతిరుగునప్పుడు భూమిపై తాను ముప్పదిసార్లు దొర్లఁగా ముప్పది డిగ్రీలను దాటును. ఇందువలననే సూర్యుఁడు ఒకరాశియందు ముప్పదిదినములుండునని చెప్పవలెను.

# శ ని దృ ష్టి.

అనంతరము గిరిజ ఈశ్వరుని జూచి "ఓ స్వామీ! శనిదృష్టి క్రూర మైనదని సెలవిచ్చిరి. అది యెవరినెట్లు బాధించినదో సెలవియ్యవలయును." అని యడుగఁగా సదాశివుఁడిట్లు ఆమెతోఁ జెప్పెను. "ఓసఖీ! వినుము. ఆదిత్యునికి ఛాయాదేవియందు జనన మొందినబాలునికి శనైశ్చరుఁడని పేరు. అది యతనికి సార్థక నామము. ఏలయన, నతఁడు అతిమందముగా నడచును. తనతండ్రి ముప్పది దినములలో నడచు కాలచక్రమునందలి ఒకరాశిని ముప్పదిమాసములలోను, దివాకరుఁడు ఒకసంవత్సరమున తిరిగివచ్చు పండ్రెండురాసులను ముప్పదివత్సరములలోను శనైశ్చరుఁడు దాటఁగలుగును." అనఁగా విని పార్వతి యిట్లు ప్రశ్న చేసెను. "నాథా! ఏమి అటుల సెలవిచ్చుచున్నారు? సూర్యుఁడు ఒక్కదినముననే పండ్రెండు రాసులను సంచరించు ననియు, ఆకాలమే దిన మనఁబడుననియు చెప్పుదురే? మీరు సెలవిచ్చునది వింతగానున్నది. దానిని వివరముగాఁ జెప్పి నాసంశయమును దీర్పుఁడు." అని యడుగఁగా ఈశ్వరుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

# గ్రహగమనము.

సూర్యుఁడు నడుమను వానిచుట్టును ఇతరగ్రహములును ఉండును. సూర్యుఁడు అశ్విని ౧-౨-౩-౪ భరణి ౧-౨-౩-౪ కృత్తిక ౧-౨-౩-౪ క్రమముగాసంచరించుచుండుటచే ముప్పదిడిగ్రీలను ఒకరాశిగా గణించి అతఁడొక రాశియందు ఒకమాస ముండునని చెప్పిరి. ఈ రాసు లేవనగా (1) మేషము, (2) వృషభము, (3) మిథునము, (4) కర్కాటకము, (5) సింహము, (6) కన్య, (7) తుల, (8) వృశ్చికము, (9) ధనస్సు, (10) మకరము, (11) కుంభము, (12) మీనము. ఆయా రాసులయందు సూర్యుడు తిరుగుచుండును. అప్పుడు శీతోష్ణస్థితులు మాఱుచుండును. వానివలన ఋతు, కాలభేదములు కలుగుచుండును. ఇటులనే వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిర మను ఋతువులారును, ఎండాకాలము, వానకాలము, శీతకాలమును, కాలత్రయమును ఏర్పడుచున్నవి.

సూర్యుని తేజము వానిచుట్టుకుండు గ్రహములపైని ప్రసరింపుచుండును. మన మొక లాంతరులో దీపముంచినపుడు దానిచుట్టునున్న పదార్థములపై వెలుతురు పడునట్లే అని భావింపవలెను. పైని చెప్పఁబడిన గ్రహము లన్నిటిలో శుక్రుఁడు

మనమున్న భూమికి సమీపమున నుండుటచే అతని వెలుతురు మనకు హెచ్చుగా కనఁబడుచున్నది. బృహస్పతి పెద్దగ్రహముగుటచే దాని వెలుతురును ఎక్కువగా కనఁబడుచున్నవి. ఈ గ్రహములన్నియు కాలచక్రమున భూమివలె తిరుగుచుండును. అటుల సంచరించునపుడు చంద్రుఁడు సూర్యునకు ఒక లక్షయోజనముల దూరమున నుండుటచే ఆకాలచక్రమును ఒకమాసములో తిరిగివచ్చును. కావున ఒక్కొక్క రాశియందు రెండురోజులన్నర యుండును. ఇతఁడు తనకిరణములద్వారా అమృతమును వెదజల్లుచుండును. శుక్ర బుధులు నెలకొక రాశిని సంచరింపుచుందురు. అంగారకుఁడు ఒకటిన్నర నెలకు ఒక్క రాశిని సంచరించును. బృహస్పతి సంవత్సరమున కొక రాశియందును, శని రెండున్నర సంవత్సరముల కొక రాశియందును సంచరింపు చుందురు. రాహువు కేతులను వారు రాక్షస గ్రహములగుటచే వెనుకకు వక్రగతిగా నడచుచుందురు. వీరిగమన వేగములు భేదించి యుండుటకు వారిస్వభావములే గాక, వారు సూర్యుని నుండియున్న దూరమును బట్టియు హెచ్చుతక్కువలు గానుండును.

## శని గురుకులవాసము చేయుట.

ఛాయాదేవియందు సూర్యునికి జన్మించిన శని క్రమక్రమముగాఁ బెరిఁగి బాల్యావస్థయందుఁగా ఒకనాడతఁడు తండ్రివద్దకుఁబోయి నమస్కరించి యిట్లు విన్నవించెను. నాన్నగారూ! విద్యాభ్యాసము చేయవలెనని నాకు కోరిక కలదు. విద్యలన్నిటిలో బ్రహ్మవిద్యగదా శ్రేష్ఠము. దానిని నాకు బోధింపఁగలవా రెవరో సెలవిండు. అనఁగా విని ఆదిత్యుఁడు పుత్త్రునిఁజూచి యిట్లుచెప్పెను. "కుమారా! విద్యలకు గురువు బృహస్పతి. ఆయన యిప్పుడు వాచస్పతి యనుపేర భూలోకమున అవతరించి నర్మదానదీతీరమునందొక గ్రామమున పెక్కు విద్యార్థులకు అన్నవస్త్రము లొసంగుచు తనయింట నుంచికొని విద్య గఱపుచున్నారు. ఆయన బ్రాహ్మణులకు తప్ప బ్రహ్మవిద్య నేర్పడు. కావున నీవు విప్రబాలుని రూపమునఁ బోయి విద్యాభ్యాసమును జేయుము." అని చెప్పఁగా శనైశ్చరుఁడు "మంచిది అటులనే చేయుదును." అని బ్రాహ్మణరూపమును ధరించి భారతవర్షమునకుఁజని నర్మదాతీరముననున్న గ్రామమును జేరి వాచస్పతిగృహమును తెలిసికొని కొందరువిద్యార్థులతోఁ గలసిపోయి వాచస్పతిని దర్శించి ఆయనతో నిట్లు సంభాషించెను.

శని—గురువర్యా! నమస్కారము.

వాచస్పతి—దీర్ఘాయుష్మాన్భవ! అబ్బాయీ! నీవెవరు?

శని—అయ్యా! నేనొక విద్యార్థిని.

వాచ—నీవంశ మెద్ది?

శని—స్వామీ! నేను కపిలమహర్షి సంతతివాఁడను మీవద్ద కొంతకాల ముండి విద్య నేర్చికొన వచ్చితిని.

వాచ—సరే! నీకేమి విద్యకావలెను?

శని—గురూత్తమా! విద్యలలో శ్రేష్ఠమగునది బ్రహ్మవిద్యకదా! దానినే యభ్యసింపఁ దలఁచితిని.

వాచ—మంచిది. అటులనే చేయుము. నీకేవిద్య కావలెనన్న నదియే నేర్పెదను. నీయిష్టానుసారము నాగృహమున నుండి నేర్చుకొనుము.

శని—చిత్తము.

అని తనయింట నుంచికొని వాచస్పతి ఆ బాలునికి బ్రహ్మవిద్య నేర్పుచుండెను. ఇట్లుండ స్వల్పకాలములో నాబాలుఁడు విద్య నభ్యసించి విద్యార్థులందఱిలో శ్రేష్ఠుఁడగుటఁజూచి గురువు మిగులసంతసించి "అబ్బాయీ! తంత్రశాస్త్రమును నేర్చుకొనుము." అనఁగా శనైశ్చరుఁడు అంగీకరించి దానినిగూడ స్వల్పకాలమున పూర్తిగా గ్రహించెను అందుకు గురువు మిగుల సంతోషించి శిష్యునితో నిట్లనెను;

గురువు—అబ్బాయీ! నీవు అన్నివిద్యలయందును పరిపూర్ణుఁడవైతివి. నీబుద్ధికి మిగుల మెచ్చితిని. ఇఁక నీవు నీయిల్లుచేరి సుఖింపుము.

శని—గురువర్యా! మీరు నాయందు దయయుంచి నాకు ఎల్లవిద్యలను శ్రద్ధతో నేర్పితిరి. మీకు గురుదక్షిణ సమర్పింపవలెనని యున్నది. కాని నావద్ద తగినంత ధనములేదు. పదునాల్గు భువనములిచ్చినను విద్యకుఁదగిన విలువకానేరదు. గురుదక్షిణ యొసంగకున్న విద్య నిష్ఫలమగును. గురుశుశ్రూష చేయుచునైనను, విశేష ధనమిచ్చియైనను లేకున్న మఱియొకవిద్య నిచ్చియైనను విద్యను గ్రహింపవలెను. అటులఁగాకున్న అది నిరర్థకమగును. కావుననే మీపాదసేవ యొనర్చుచుంటిని. విద్యాభ్యాసమునకు దక్షిణయే మూలము. అది లేకున్న విద్య నిష్ఫలమగును. కావున నాయందు కరుణించి నాశక్తి సామర్థ్యములకు బట్టి గురుదక్షిణ కోరుఁడు. ", అని వినయపూర్వకముగా నమస్కరించి యెదుట నిల్చెను.

గురువు—ఓవత్సా! నాకు దక్షిణ యవసరము లేదు. నీవచ నామృతధారలవలన నాహృదయము తృప్తిఁబొందినది. చాల సంతోషించితిని. నీవు కపట వేషమున వచ్చినట్లు కానఁబడుచున్నావు. నీ వెవరో వినఁగానే నమ్మకము కలుగునట్లు చెప్పుము.

శని—ఓగురుదేవా! వినుఁడు, నేను ఛాయాదేవియందు సూర్యునికి జన్మించిన పుత్త్రుఁడను. నాపేరు శనైశ్చరుఁడందురు. మాతండ్రియగు సూర్యుని యాదేశమున మాఱువేషమున వచ్చి మీవద్ద సమస్తవిద్యల నభ్యసించి కృతార్థుడ నైతిని. తమయాశీర్వాదమును బొంది నిజగృహమున కరిగెదను. సెలవిండు.

వాచ—(ఆమాటలు వినినంతమాత్రమున భయవిహ్వలుడై శరీరము పులకాంకురములతో నిండ) ఓవత్సా! నీవు మహాబుద్ధిశాలివి. నీపరాక్రమము లోకాతీతమైనది. నిన్నుఁ జూచుటవలనఁ గృతార్థుఁడ నైతిని. నీవు నాతోఁజెప్పిన ప్రకారము నాకు గురుదక్షిణ నిచ్చుటకు నీకిష్టమున్న దానిని నే నిప్పుడడిగెదను. నాకు దయతో నిమ్ము. నే నెన్నిదినములవఱకు ఈదేహమును ధరించి యీ లోకమున నుందునో, అంతకాలము నీక్రూరదృష్టి నాపైఁబడనీక యుండుము. ఇదే గురుదక్షిణ.

శని—గురువర్యా! అసాధ్యమును గోరితిరి. ఆబ్రహ్మ నుదుట వ్రాసిన వ్రాలు తప్పింప నెవరికి శక్యమగును. ఐనను తమయందు నాకుఁగల గౌరవమును నిలుపవలెను. కాన మనవిచేయుచున్నాను వినుండు. మీ జీవితకాలమున నెప్పుడైన నొకసారి నాకోపదృష్టి మీపైఁ బడకమానదు. అప్పుడు మీరు గొప్ప యాపదలోమునిఁగి తేలుదురు. ఇందుకు సందేహము లేదు. నమ్ముడు. ఇదిగో! నా నమస్కారము లంగీకరించి సెల వొసంగుఁడు. పోయివచ్చెదను.

అని గురువుతో మనవిచేసి ఆయనవలన నాశీర్వదింపఁబడి శని తనయింటికిఁ బోయి తండ్రికి నమస్కరింపఁగా దివాకరుఁడు పుత్త్రునిఁజూచి యానందించెను.

## బృహస్పతి శనిదృష్టికి భయపడుట.

అనంతరము బృహస్పతి శనిచెప్పిన మాటలు తలంచుకొనుచు భీతినొంది ఆతని దృష్టి తనపై నెప్పుడు పడునో యని తన జాతకమును గుణింపుచుండెను. కాని ఆసమయమును నిశ్చయింపఁ జాలక తన శిష్యులలో కొందరిని చేరఁబిలిచి లెక్క చూడు మనెను. వారును తామును ఏకీభవించి ఆదినమును నిశ్చయించిరి. ఏమి యాపద కలుగునో అది యెటుల తప్పునో యని గురుఁడు తపించుచు శ్రీహరిని సర్వకాలములయందు నిండుభక్తితో ధ్యానింపుచుండెను. అంతట నొకనాఁడాదిన

మాసన్నముకాఁగా గురుఁడాదినమున మామూలుప్రకారము ఉషఃకాలమున లేచి స్నానసంధ్యాది నిత్యకర్మలను దీర్చుకొని ఏకాగ్రచిత్తముతో శ్రీహరినిట్లు ప్రార్థించెను. "ఓహరీ! నిరాకారా! నిరంజనా! చిన్మయాకారా! చిదానందస్వరూపా! ఆపదుద్ధారకా! దీనరక్షకా! దీనశరణ్యా! భక్తబాంధవా! దయామయా! నిత్యా! సనాతనా! భవభయనివారకా! కమలలోచనా! శ్రీహరీ! నన్నీ దినమున సర్వవిపత్తులనుండి కాపాడి రక్షింపుము. నీవుతప్ప మఱి వేరురక్షకు లెవరు? ఓపరమాత్మా! నీవే యాత్మరూపమున సకలప్రాణులయందున్నావు. సృష్టిస్థితిలయములకు నీవే కర్తవు. నీకన్న పరులెవరు? నా భక్తిపూర్వక ప్రణామముల నంగీకరించి ఆపత్సముద్రమునఁ బడియున్న నన్ను దయతోఁగాపాడి రక్షింపుము, రక్షింపుము." అని ప్రార్థించి పూలసజ్జచేఁబట్టి, ఇల్లు బయలుదేఱి, కొంతదూరమున నున్న యుద్యావనముఁ జేరెను. సమస్తపరిమళ పుష్పములతో నిండియున్న యాపూఁదోఁట కోయిలల కుహూ కుహూనాదంబులతో నిండియుండెను. తుమ్మెదలు, ఝుంకారములు చేయుచు నొకపుష్పమునుండి వేఱొండు పుష్పమున కెగురుచుండెను. మయూరములు క్రేంకారవంబు లొనర్చుచు అచ్చటచ్చట నాడుచుండెను. వృక్షములపైనుండి శుక పిక శారికాదులు మధురరుతములఁ జేయుచుండెను. దాని నడుమనున్న దివ్యసరోవరంబున కలువలు, తామరలుపూచి యుండెను. ఆతోఁటయందలి వృక్షములన్నియు ఫలపుష్పములతో నిండి బహురమ్యముగా నుండెను. దానిని జూచి గురుఁడానందించి పూలసజ్జ నొకచోటనుంచి పుష్పములనుకోసి యందు వేయుచుండెను.

శని బృహస్పతిని రక్షించుటను గురించి ప్రమోధూత సంవత్సరమునందు ప్రకటింపబడును.

## సూర్యచంద్రనాడీ ఫలములు.

నాశిక కుడిరంధ్రమునుండి వచ్చుగాలి సూర్యనాడి ఎడమరంధ్రమునుండి వచ్చుగాలి చంద్రనాడి యీనాడి 2 ఘంటలకొకసారి మార్పుచెందును. ఆదివారము, మంగళవారము, గురువారం, శనివారం, సూర్యునిదినములు. సోమవారం, బుధవారం, శుక్రవారం, చంద్రునిదినములు. సూర్యోదయమున నిద్రలేచుసరికి ఆయావారములయందు ఆయానాడులు నడచినచో యెట్టిఆటంకంబులును కలుగక అన్నిపనులూ అనుకూలమగును, అట్లు ఆరోజులలో ఆనాడిసంచరించని ఎడల దేహాయాసం కలహం, కార్యవిఘ్నం అకాలభోజనం, కోపం కలుగును.

## ఇందులకు ఉపశాంతి.

సూర్యుని దినమునందు చంద్రనాడిఆడిన తూర్పు లేక ఉత్తరంగా ఎడమపాదముంచియు, చంద్రునిదినమునందు సూర్యనాడిఆడిన, దక్షిణం పశ్చిమముగా గాని కుడిపాదముంచి ముందుకు 3 అడుగులు నడవవలయును.

(1) వ్యాపారము, గర్భాధానము, మంగళస్నానము, భీతి, అపజయము, యుద్ధము, వ్రాయుట, భోజనము, బాధ, వీటికి సూర్యనాడి ఆడునపుడు కుడిపాదము ముందుయుంచి నడువవలయును.

(2) వివాహం, చేనుదున్నట, ప్రయాణం, నగలుధరించుట గృహారంభం, తోటపాటలు, వీటికి చంద్రనాడి మేలు ఎడమపాదం ముందువేసి వెళ్లవలెను.

## స్వర పరీక్ష.

సంవత్సరాదియందు ప్రతిమానవుండును, సూర్యోదయమునకు పూర్వమున నిద్రమేల్కాంచి స్వరపరీక్షను జేయవలయును. సంవత్సరాది మొదలు 3 దినములును చంద్రనాడీ సంచారము ప్రతిమానవునికిని జరుగుచుండవలయును. ఆదినత్రయ మధ్యమున యేదినమున చంద్రనాడీ సంచారము సంభవింపదో సంవత్సరాది మొదలు నాలుగుమాసములవరకు మానవునకు అశుభంబులును, కష్టములును తటస్థించును. మూడుదినంబులును చంద్రనాడీ సంచారముగలుగువానికి ఆసంవత్సరము సుఖ, శుభ, ఐశ్వర్యసమృద్ధి గలుగును. చవితియందు వారస్వరము లేకున్న బంధుమిత్రవిరోధం పంచమియందు వారస్వరము లేకున్న ముఖ్యమైనబంధువునకు భయం, షష్టియందువారస్వరము లేకున్న దేశమునువిడుచును. సప్తమియందువారస్వరము లేకున్న నిశ్శేషనష్టం. అష్టమిని వారస్వరము లేకున్న సంవత్సరంలోగా మరణమును పొందును.

### —: సర్వకార్యానుకూల భార్గవహోరల టేబిల్ :—

| | | | |
|---|---|---|---|
| పగలు ఆ | 7 – 9 – 11 – 2 – 4 | రాత్రి | 6 – 9 – 11 – 1 – 4 |
| సో | 6 – 8 – 11 – 1 – 3 – 5 | | 6 – 8 – 10 – 1 – 5 |
| మ | 8 – 10 – 12 – 3 – 5 | | 7 – 10 – 12 – 2 – 5 |
| బు | 7 – 9 – 12 – 2 – 4 | | 7 – 9 – 11 – 2 – 4 |
| గు | 6 – 9 – 11 – 1 – 4 | | 6 – 8 – 11 – 1 – 3 |
| శు | 6 – 8 – 10 – 1 – 5 | | 8 – 10 – 12 – 3 – 5 |
| శ | 7 – 10 – 12 – 2 – 5 | | 7 – 9 – 12 – 2 – 4 |

యిందుచూపిన ఘంటలుకొట్టినపిమ్మట ఒకగంటలోగా సమస్తకార్యములు రాహుకాలమందైనను శుభముగా కార్యానుకూలమగును.

## ప్రయాణేకౌస్తుభ యోగః.

ఆదివారము తననీడ 11 అడుగులు ఎండలో పారునప్పుడును సోమ॥ 4 న్నర అడుగులు. మం॥ 9 అడు॥ బుధ॥ 8 అడు॥ గురు॥ 7 అడు॥ శుక్ర-శని॥ 4 న్నర అడుగులు నీడ పారునప్పుడు ప్రయాణముచేసిన సర్వకార్యములు సఫలమగును. ఆయాకాలములయిందు పంచాంగ శుద్ధియు, ఖచరదోషము పాటింపనక్కరలేదని గర్గమహాముని చెప్పెను.

# తారాబలచక్రము నిత్యనక్షత్రములు.

| జన్మనక్షత్రములు | అ మ మూ | భ పు పూ | కృ ఉ ఉ | రో హ శ్ర | మృ చి ధ | ఆ స్వా శ | పు వి పూ | పు అ ఉ | ఆ జ్యే రే |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ మ మూ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ |
| భ పు పూ | ౯ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
| కృ ఉ ఉ | ౮ | ౯ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ |
| రో హ శ్ర | ౭ | ౮ | ౯ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ |
| మృ చి ధ | ౬ | ౭ | ౮ | ౯ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ |
| ఆ స్వా శ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧ | ౨ | ౩ | ౪ |
| పు వి పూ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧ | ౨ | ౩ |
| పు అ ఉ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧ | ౨ |
| ఆ జ్యే రే | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧ |

౧ జన్మతార, ౨ సంపత్తార, ౩ ద్విపత్తార, ౪ క్షేమతార, ౫ ప్రత్యక్తార, ౬ సాధనతార, ౭ నైధనతార, ౮ మిత్రతార, ౯ పరమమైత్రతార,

## సూర్యోదయాస్తమయ...

| నెల. | తేది | ఉ | అ | నెల. | తేది | ఉ | అ |
|---|---|---|---|---|---|---|---|
| ఏప్రియల్ | ౧౦ | ౫ ౫౨ | ౬ ౮ | అక్టోబరు | ౧౦ | ౬ ౮ | ౫ ౫౨ |
| | ౨౦ | ౫ ౪౭ | ౬ ౧౩ | | ౨౦ | ౬ ౧౩ | ౫ ౪౭ |
| | ౩౦ | ౫ ౪౩ | ౬ ౧౭ | | ౩౦ | ౬ ౧౮ | ౫ ౪౨ |
| మే నెల | ౧౦ | ౫ ౩౯ | ౬ ౨౧ | నవంబరు | ౧౦ | ౬ ౨౨ | ౫ ౩౮ |
| | ౨౦ | ౫ ౩౫ | ౬ ౨౫ | | ౨౦ | ౬ ౨౬ | ౫ ౩౪ |
| | ౩౦ | ౫ ౩౩ | ౬ ౨౭ | | ౩౦ | ౬ ౨౯ | ౫ ౩౧ |
| జూన్ నెల | ౧౦ | ౫ ౩౧ | ౬ ౨౯ | డిశంబరు | ౧౦ | ౬ ౩౦ | ౫ ౩౦ |
| | ౨౦ | ౫ ౩౦ | ౬ ౩౦ | | ౨౦ | ౬ ౩౧ | ౫ ౨౯ |
| | ౩౦ | ౫ ౨౯ | ౬ ౩౧ | | ౩౦ | ౬ ౩౦ | ౫ ౩౦ |
| జూలై నెల | ౧౦ | ౫ ౩౨ | ౬ ౨౮ | జనవరి నెల | ౧౦ | ౬ ౨౯ | ౫ ౩౧ |
| | ౨౦ | ౫ ౩౫ | ౬ ౨౫ | | ౨౦ | ౬ ౨౬ | ౫ ౩౪ |
| | ౩౦ | ౫ ౩౬ | ౬ ౨౪ | | ౩౦ | ౬ ౨౩ | ౫ ౩౭ |
| ఆగష్టు నెల | ౧ | ౫ ౪౦ | ౬ ౨౦ | ఫిబ్రేవరి | ౧౦ | ౬ ౧౭ | ౫ ౪౩ |
| | ౨౦ | ౫ ౪౪ | ౬ ౧౬ | | ౨౦ | ౬ ౧౫ | ౫ ౪౫ |
| | ౩౦ | ౫ ౪౮ | ౬ ౧౨ | | ౨౮ | ౬ ౧౧ | ౫ ౪౯ |
| సెప్టెంబరు | ౧౦ | ౫ ౫౨ | ౬ ౮ | మార్చి | ౧౦ | ౬ ౬ | ౫ ౫౪ |
| | ౨౦ | ౫ ౫౬ | ౬ ౪ | | ౨౦ | ౫ ౫౯ | ౬ ౧ |
| | ౩౦ | ౬ ౨ | ౫ ౫౮ | | ౩౦ | ౫ ౫౬ | ౬ ౪ |

## రాహుకాల గుళికకాలముల దెలుపు ఘంటాది.

| వారం | ఘం - ని | ఘం - ని | వారం | ఘం - ని | ఘం - ని |
|---|---|---|---|---|---|
| ఆది | 4 - 30 | 6 - 0 | ఆది | 4 - 30 | 6 - 0 |
| సోమ | 7 - 30 | 9 - 0 | సోమ | 3 - 0 | 4 - 30 |
| మంగళ | 3 - 0 | 4 - 30 | మంగళ | 1 - 30 | 3 - 0 |
| బుధ | 12 - 0 | 1 - 30 | బుధ | 12 - 0 | 1 - 30 |
| గురు | 1 - 30 | 3 - 0 | గురు | 10 - 30 | 12 - 0 |
| శుక్ర | 10 - 30 | 12 - 0 | శుక్ర | 9 - 0 | 10 - 30 |
| శని | 9 - 0 | 10 - 30 | శని | 7 - 30 | 9 - 0 |

# విజ్ఞప్తి.



ఈ శుక్లనామసంవత్సరంబున పొరబాటున ద్వాదశమాసముల యందు, తిథులయొక్క కడపట, సూర్యునియొక్క, నిలవభోగ్యమునకు భో-అను అక్షరముండవలసిన దానికి భు-అను అక్షరము, పొరబాటున ముద్రింపబడినది. అచ్చట సూర్యునియొక్క భోగ్యమనియే మాచదువురులందఱు గ్రహింపవలెను. అదిభుక్తి అని గ్రహింపకూడదు. అది భోగ్యముగాని భుక్తిగాదు. యీఫారములు ఇతర ఆఫీసులలో ముద్రింపబడినందున అట్లు జరిగినది.



## మఱియొక విజ్ఞాపనము.



పీఠికలో 1 పుట మొదలు 8 పేజీలుండవలసిన దానికి 9 పుట మొదలు 16 పేజీవరకును. 2 ఫారం. కూడా అదే పేజీలుగా ముద్రింప బడినవి. పంచాంగము సక్రమముగా నున్నదని చదువురు లందఱు గ్రహింపగలరు. ముద్రించిన పిమ్మట అన్ని పేజీలలో, సవరణచేయుట దుర్లభమని యీ ప్రకటనపత్రికయందు చేర్పబడినది. అచ్చులోపము నకు సుజనులు క్షమింతురుగాక.

ఇట్లు,

చల్లా - లక్ష్మీనృసింహశాస్త్రులు.

బందరు.

అధిక చైత్రే॥ శ్లో॥ స్వల్పలాభయుగశుక్ర మందే చంద్రే సమా
గతే। వృష్టిరాగ స్తథా ప్రాహుః। జననాశకర స్స్మృతాః॥ కేజ్య
మాకలితాః ఏకరాశిస్థితా యది। దుర్భిక్షయోగం సంప్రాహుః।
ముద్రిమపిశోషితాః॥

నిజ చైత్రే॥ శ్లో॥ పంచభౌమయదా చైత్రే లోకానాం భయమాది
శేత్ నృపక్షోభం ప్రజానాశం ఘోరాగ్నిభయపీడనం॥ శనిశుక్ర
యోరన్యోన్యం చతుర్థాష్టదశస్థితే। పురస్సన్యస్తథాకాలే సంచరే
దృష్టినాశనం॥

వైశాఖే॥ శ్లో॥ వైశాఖే యది సప్తమ్యాం ధనిష్ఠావాస్మృతిర్భవేత్।
స్యామవస్తుమహార్ఘం స్యాత్ సమానార్ఘం ధవళం తథా॥ మృగరాశిగతే
దేవకీకేతుభాస్కరనందనే। తన్మధ్యే ధ్వజసంయుక్తే మృత్యుశోకాకులాభువి॥

జ్యేష్ఠే॥ శ్లో॥ శుక్రాస్సప్తమరాశిస్థే శనాచంద్రసమన్వితాః।
సర్వకామోదవృష్టిస్స్యాజ్జనసౌఖ్యం సుభిక్షకృత్॥

ఆషాఢే॥ శ్లో॥ ఆషాఢపూర్ణిమాయత్రి న్యూనాః పంచదశా
ఘటీః। తదా దుఃఖంతు లోకానాం మ్రియతే నాత్ర సంశయః॥

శ్రావణే॥ శ్లో॥ యదా శుక్రస్య సౌమ్యస్య పురతో రవిమండలం।
అవర్తజలయోగోయం జలార్ద్రాం కురుతే మహీం॥

భాద్రపదే॥ శ్లో॥ బుధరాశిగతో భానుః భానురాశిగతో బుధః।
చంద్రాసితభృగుసంయుక్తే కుర్యాదేకార్ణవంజగత్॥ శుక్రరాశిసమారభ్య
చతురష్టసితే శశా। తన్మధ్యే కుజారసంయుక్తా దల్పవృష్టిహ్యానఘర్ఘదా॥

ఆశ్వీజే॥ శ్లో॥ నందేజీవే రుజుర్మధ్యే భౌమేవక్రం ప్రజాయతే।
అనావృష్టిశ్చ దుర్భిక్షం జననాశంకరం స్మృతాః॥ మృగరాశిగతే జీవే మృత్యు
శోకాకులాభువి॥

కార్తీకే॥ శ్లో॥ యదా శుక్రస్య పురతో భానుజో యది గచ్ఛతి।
వేపశ్చాద్భూమిసుతో సింహారమనువర్తతి॥ ఇనసూనుగతే రాశౌ త్రివ
ర్షయగతే గురౌ। వింధ్యాద్రిలంకయోర్మధ్యే పతంతి శవకోటయః॥

మార్గశీర్షే॥ శ్లో॥ మార్గే నవమ్యాం చిత్రాయాం మహార్ఘం
ధాన్యమాదిశేత్। రోగాణామాకులం యాతి మ్రియతే నాత్ర సంశయః॥

పుష్యే॥ శ్లో॥ పౌష్యమాసే త్వమావాస్యాం యదిసోమవతీభవే
త్। లోకానాం క్షేమమారోగ్యం ధాన్యాదీనాం మహార్ఘతాం॥

మాఘే। శ్లో॥ చతుర్గ్రహానుమానస్య శనివారేణ సంయుతా।
మధ్యేతు మృత్యుదోరాశ్చ్రీ క్షయం ధాన్యవినాశనం ॥
ఫాల్గునే॥ శ్లో॥ అవిచారాగ దేశీనే। నక్షత్రే సిసిశనైశ్చరే। హాహా
కారంజగత్సర్వా మధ్యే కంచైవ భూతలే।

వశ్యకూటం స్త్రీ పురుష రాసులనుంచి చూచుకునేది.

| | రాశ్యములు | వశ్యకా॥ | వైరకా॥ | భక్ష్యకా॥ |
|---|---|---|---|---|
| చతుష్పద | మేషము, వృషభ, | చతు॥ జ | వ, కీటు | మా |
| మానవ | మి-కర-కుం, ధ, తు, | మానవ | వ, కీ, జ, | చతు |
| జలచర | కటు-మక-మీ, | వ, కీ, జ, | మానవ | చతు |
| వనచర | సింహము, | జల, వన | కీటక | చ, మాన |
| కీటక | వృశ్చికము. | చ, కీ, జన, | మానవ | —*— |

రాసికూటమునకు స్త్రీ రాస్యాది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మృత్యుః | దుఃఖం | నిర్ధనం | అశుభం | పుత్రనాశనం | మాంగల్యం |
| ౨-౧౨ | 3-౧౧ | ౪-౧౦ | ౯-౫ | ౬-౮ | ౭-౭ |
| ఆయుః | సుఖం | ధనం | శుభం | పుత్రలాభం | మాంగల్యం |
| ౧౨-౨ | ౧౧-3 | ౧౦-౪ | ౫-౯ | ౮-౬ | ౭-౭ |

గ్రహమైత్రిత్వం.

| గ్రహములు | ర | చ | కు | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రత్వం | చ కు గు | ర బు | ర చ గు | ర శు | ర చ కు | బు శ | బు శు |
| శతృత్వం | శు శ | ...... | బు | చ | బు శు | ర చ | ర చ కు |
| సమత్వం | బు | కు గు శుశ | శు శ | కు గు శ | శ | కు గు | గు |

## శుక్ల సం॥ ర పంచాంగములో 22 వ పుటయొక్క సశేషము.

### శని బృహస్పతిని రక్షించుట.

ఆసమయమున వాచస్పతి చేతులు జోడించుకొని శనైశ్చరు నిట్లు స్తోత్రము చేసెను. "ఓగ్రహరాజా! సూర్యపుత్త్రా! కాలరూపా! జ్యోతిర్మయాకారా! ఛాయాదేవీతనూజా; త్రిమూర్తిస్వరూపా! త్రిజగద్వ్యాపీ! నాయందు దయయుంచి పూర్వము నీవొసంగిన వాగ్దానమును మఱవక నాకు సుప్రసన్నుఁడవై యీమహావిపత్తును తప్పించి నన్ను రక్షింపుము. నీదయార్ద్రదృష్టివలన దరిద్రులు ధనవంతులును, మూర్ఖులు మహాజ్ఞానులును, అగుదురు. స్వర్గమర్త్య పాతాళ మందెవరైనను నీకు ప్రతికక్షి వహించువారు నశింతురు. నాయందు కటాక్షముంచి యీవిపదబ్ధిని ముంచక కాపాడుము." అని తనగురు వొనర్చుప్రార్థనలకు సంతసించి శనైశ్చరుఁడు, తనపురమును విడిచి యంబరమున నిల్చి తనగురువు నుద్దేశించి బిగ్గఱగా నిట్లానతిచ్చెను. "ఓగురువర్యా! స్థిరచిత్తమును, వహించి శాంతింపుఁడు. భీతిల్ల నవసరములేదు. పూర్వము మీసన్నిధానమున వాగ్దాన మొనర్చియుంటిని. అటులనే చేయుదును. వెఱవకుఁడు. నేఁడు మొదలు తమకు మఱియాపదలు మూఁడవు. శుభములే కలుగుచుండును. నిశ్చింతతో నుండుఁడు" అని వీరబాహువును జూచి యిట్లనెను. "ఓరాజా! విచారింపకుము, నీపుత్త్రుఁడు అంతఃపురమున నిద్రించుచున్నాఁడు. ఇదంతయు నామాయాప్రభావమున జరిగినది. ఈవిప్రుఁడు నిర్దోషి. బహుపవిత్రుఁడు ఆయనకుఁ దగిన సత్కారము లొనర్చి విడిచిపుచ్చుము. నేఁటి నుండి నీవును నీప్రజలును నన్ను సేవింపుచుండిన మీకెట్టికీడును మూఁడదు" అని చెప్పి శని అంతర్ధానము నొందెను. వీరబాహువు వాచస్పతిని క్షమాపణ కోరికొని తగినమర్యాదచేసి పంపెను. పిమ్మట నాచక్రవర్తియు నతనిప్రజలును ప్రతిశనివారమున శనిని పూజింపుచు సుఖముగా నుండిరి. అని శివుఁడు చెప్పఁగా విని పార్వతి ఆశ్చర్యపడెను.

### శని దృష్టి.

తదనంతరము ఉమాదేవి యీశ్వరునిఁ జూచి యిట్లు ప్రశ్నచేసెను. "ఓ స్వామీ! శనిదృష్టి యెంతక్రూరమైనది! తనగురువునకు నెంతయాపద కలిగించెను? ఇతని మాహాత్మ్యమును ఇంకను వినవలతును. సెలవిండు" అని యడుగఁగా ఈశ్వరుఁడిట్లు చెప్పనారంభించెను.

### ఏల్నాటి శని.

ఓలలనా! ఈ శనిగ్రహములలో మిగుల బలవంతుఁడు. జనులకు మేలుగాని కీడుగాని చేయుటయందు అంతసమర్థుఁడు మఱియొకఁడు లేఁడు. జనుల జాతకము

లనుబట్టి నవగ్రహములును పండ్రెండు రాసులలో కొన్నిటియందుందురు. వారిలో శని, సూర్యుఁడు, కుజుఁడు, గురుఁడు వీరు నలువురును, చంద్రుఁడున్న రాశియందు గాని, దానికనిమిదవ, పండ్రెండవ రాసులయందుగాని యుండునప్పుడు ఆజాతకునికి అశుభము చేయుచుందురు. ఈ శని ద్వాదశ జన్మ ద్వితీయ రాసులయందుండునప్పుడు ఏల్నాటిశని యందురు. శని ఒక్కొక్క రాశియందు రెండు సంవత్సరముల యారు మాసములుండునని చెప్పి యుంటిని గాదా? ఈసూఁడు రాసులయందుండు కాలము లో గొప్ప మేలుగాని, కీడుగాని చేయును. ఇశని శరీరచ్ఛాయ యాయారాసులయం దతఁడు ప్రవేశించునపుడు మారుచుండును. సువర్ణచ్ఛాయ, రజితచ్ఛాయ, తామ్ర చ్ఛాయ, లోహచ్ఛాయలలో నేకో యొకవర్ణము కలిగియుండును. సువర్ణకాంతి తో, నొకరాశియందు ప్రవేశించునపుడు పూర్ణమైన శుభఫలములను, రజితవర్ణమైన సామాన్యఫలములను, తామ్రవర్ణమైన కష్టములను, లోహవర్ణమైన మరణమును కలుగఁజేయును. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అతఁడు ఏరాశియందు ఏవర్ణముతో ప్రవేశించునో లెక్కించి తెలిసికొని దాని కనుసరించు ఫలములఁ జెప్పఁగలరు. ఈ శని ఆకాలములో మొదట కీడుచేసిన వారికి తరువాత మేలును, మొదట మేలుచేసిన వారికి తరువాతఁ గీడును వారి వారి పూర్వకర్మానుసారము చేయుచుండును.

శనిని పూజింపవలెనని రాజు రాణితోఁ జెప్పుట.

ఇట్లు కొంతసేపు వారు ఇష్టగోష్ఠి సలుపుచుండఁగా రాణి రాజుతోనిట్లనెను.

రాణి- ఓప్రియనాథా! మన కిట్టి యిడుములు సంప్రాప్తమై యుండుటకు కారణ మేమై యుండును?

రాజు- ఓసఖీ? ఏమని చెప్పుదును. ప్రారబ్ధమనుభవింపక తీరునా?

రాణి- నాధా! ప్రారబ్దమనఁగా నేమి?

రాజు- సఖీ! పూర్వజన్మములందు జనులార్జించిన పుణ్యపాపముల ఫలము నే, వారు మరల జన్మించి అనుభవింపుదురు. దానికే ప్రారబ్ధమని పేరు దానిని తప్పించు కొనుట త్రిమూర్తులైన హరిహరబ్రహ్మలకైన చేతగాదు. మనమనఁగా నెంత?

రాణి- ఓప్రాణేశ్వరా! అటులైన మనకు మఱి జన్మలేదా?.

రాజు- ప్రాణేశ్వరీ! అది మన మెట్లు నిశ్చయింపఁగలము?

రాణి- ఏమీ? ఏల నిశ్చయింపఁజాలము? పూర్వభవనమున జేయఁబడిన పాపపుణ్యము లీజన్మమున ననుభవ మగునపుడు మఱియేమి మిగిలియుండును? ముందు జన్మమున చేయవలసినదేమి యుండును?

రాజు- ఓ లలనామణీ! అటుల కాదు. పూర్వభవనమునందు చేయబడిన కర్మఫలములో కొంతయే యీజన్మమందు మన మనుభవించుటకు నిర్ణయింపఁబడి యున్నది. మిగిలియున్న దానికే సంచితమని పేరు. దీనికి ఆగామికలియుచుండును. ఈజన్మమున నే చేయఁబడు ఫలమునకు ఆగామి యని పేరు.

రాణి- నాథా! అట్లయిన మన మెంతకాలము చచ్చుచుపుట్టుచుండవలయును

రాజు- ఓసఖీ! మంచిప్రశ్న వేసితివి? జ్ఞానోదయ మగువఱకును ఇట్లుపుట్టుచు గిట్టుచు నుండవలయును.

రాణి- ఏమీ? మనకు జ్ఞాన మింకను పుట్టలేదా?

రాజు- ఓరాజ్యలక్ష్మీ! ఈమనజ్ఞానము జ్ఞానముగాదు, జ్ఞానము రెండు విధములు. ఇహలోకజ్ఞానము, పరలోకజ్ఞానము.

రాణి- నాథా! పరలోకమనఁగా నేమి? అది ఎచ్చట నుండును?

రాజు- ఓచెలిమీ! పరలోకము ఒకటికాదు, ఇంద్రాదిదేవతలు నివసించు స్వర్గము, సృష్టికర్తయగు బ్రహ్మ నివసించు సత్యలోకము, సృష్టిని పాలించు విష్ణువు నివసించు వైకుంఠము, ఆసృష్టిని సంహరింపఁజేయు శివుడు నివసించు కైలాసము, శ్రీరాధాకాంతుఁడగు శ్రీకృష్ణుఁడు సదా నివసించుచుండు గోలోకము, ఈజగత్తు లన్నిటికిని కర్తయు, సృష్టిస్థితిలయకారణులగు త్రిమూర్తులకు జననియు తేజోరాశియునగు ఆదిశక్తి సదా సగుణరూపములతో నివసించుచుండు మణిద్వీపమును పరలోకము లనఁబడును.

రాణి- అబ్బా! పరలోకములు పెక్కులున్నవే? వానిలో తారతమ్యము లున్న సెలవిండు.

రాజు- ఓప్రాణేశ్వరీ! చెప్పెద వినుము. నరులలో యజ్ఞయాగాదికార్యము లొనర్చినవారు మరణానంతరము స్వర్గమునకుఁబోయి అందు కొంతకాలము భోగము లనుభవించి మరల భూమియందు జన్మింపరు. అంత కెక్కుడు మహాపుణ్యకార్యము లొనర్చినవారు బ్రహ్మ విష్ణుమహేశ్వరులుండు సత్య, వైకుంఠ, కైలాసములకుఁ బోయి ఆయాలోకాధిపతు లున్నంతకాలము నివసించి వారితో నశించి మరల సృష్ట్యాదియందు భూలోకమున జన్మింతురు. గోలోక మణిద్వీపములు శాశ్వతమనియు అందు పోవుజ్ఞానులు అందు స్థిరముగా సాలోక్య సామీప్య సారూప్యము లను ముక్తులలో దేనినైనను పొందుదురనియు వారలకు మాత్రము చావుపుట్టుక లుండవనియు చెప్పుదురు. కావున అట్టివారినే శాశ్వతబ్రహ్మలోక నివాససిద్ధ నొందినవారని చెప్పుదురు.

రాణి- నాథా! అటుల చావుపుట్టుక లేనిస్థలము మనకెట్లు లభించును.

రాజు- ఓసఖీ! బ్రహ్మజ్ఞానమును పొందుటవలన సంచితమును దహింపఁజేసికొని తానొనరించు కర్మఫలమును కోరక త్యజియించుటవలన ఆగామిని శ్రీపరదేవతార్పణము చేయుచు, ప్రారబ్ధము భుక్తికాఁగా పుట్టుకచావులేని స్థలమును పొందవచ్చును.

రాణి- బ్రహ్మజ్ఞాన మనఁగా నేమి? దానిని పొందుట యెట్లు?

రాజు- ఓలలనా! వినుము. ఈసచరాచరములగు జగత్తులకు కర్తయగు ఆతేజోరాశియైన యాదిశక్తిస్వరూపుఁడగు శ్రీసూర్యభగవానుఁడే ఆయాస్థావరము లందును వృక్షలతాగుల్మాదులందును, జంగమములగు మనుష్య, మృగ, పక్షి, కీట కాదులందును ఆత్మరూపమున వ్యాపించియున్నాఁడని తెలిసికొని తన్ను తాను ప్రేమించుకొనునట్లే వానిని ప్రేమించుటయే బ్రహ్మజ్ఞాన మనఁబడును. అట్టియ భేద బుద్ధి గలుగునప్పుడు ఈజగత్తులం దంతటను ఆసూర్యుఁడే వేరువేరురూపముల నిండి యున్నాఁడను జ్ఞానమే బ్రహ్మజ్ఞానము. దీనివలననే జన్మరాహిత్యము కలిగి శాశ్వత బ్రహ్మలోక నివాసము లభించును. దీనికే బరలోక జ్ఞానమందురు.

రాణి- ఓప్రాణేశ్వరా! మీకింతజ్ఞాన మెట్లు లభించెను?

రాజు- ఓప్రేయసీ! నాడు నేను నిన్నును, రాజ్యమును విడిచి అడవికిఁ పోయి యచ్చటఁ జేయునది లేక ప్రత్యక్షదైవమగు సూర్యభగవానుని త్రికరణ శుద్ధిగా అనఁగా మనస్సు వాక్కు కాయములచే ధ్యానించి జపించుచుంటిని. అట్లు కొంతకాలములో నొకనాఁడు ఒకసిద్ధపురుషుఁడు నాకు దర్శన మొసంగెను. ఆమహాపురుషునివలన నీజ్ఞానము నాకు లభించినది. ఈతేజోరాశియగు ఆదిత్యుఁడు ఆపరదేవతయొక్క ఆదిరూపమని ఆయన నాకుఁ జెప్పెను. ఈసూర్యుని పుత్రు లలో నొకఁడగు శనైశ్చరుఁడు నవగ్రహములలో గొప్పవాఁడు. ఆతనిదృష్టి క్రూర మైనది. అతఁడు నాజన్మరాశివశమున ద్వాదశమునఁ బ్రవేశించుటచే మనకీ కష్ట ములు సంభవించెనఁట. కావున మన మాతనిని భక్తిశ్రద్ధలతోఁ బూజించిన మన యిడుమలు తుదముట్టి మరల రాజ్యము లభించును

రాణి- చిత్తము, అటులనే చేయుదము, ఈయుదంత మెఱిఁగియుండియు నింతకుముందు అటుల మీరు చేయకుంటిరేల?

రాజు- ఓనారీరత్నమా! ఇంతకు ముందు నిన్నెడఁబాసియుంటిని కావున చేయుటకు వీలుపడలేదు. పురుషుఁడు పత్నీసహితుఁడై చేయుకర్మలు ఫలించును. అపత్నీకునికి కర్మాధికారములేదు. "భార్యామూల మిదం గృహం" అనువాక్యము లోక ప్రసిద్ధముగదా! గృహస్థునకే సర్వకర్మలు చేయు నధికారము కలదు. కావు ననే నేనింతవఱకు నిరీక్షించుచుంటిని.

రాణి- ప్రాణేశ్వరా! ఆశనైశ్చరుని గుఱించి నేనును వినియుంటిని. కీడు గాని, మేలుగాని చేయుటకు అంతవాఁడు గ్రహములలో మఱియొకఁడు లేఁడు. కావున మన మతనిని త్వరగా పూజింపవలయును,

---

## వీరసేనుడు శనిని పూజించుట.

అని యిట్లు తీర్మానించుకొని ఆమఱుచటి దినముననే శనిత్రయోదశి అయి నందున ఆవధూవరులు ప్రాతఃకాలమున లేచి స్నానసంధ్యావందనములు తీర్చికొని నవగ్రహములను ప్రతిష్ఠించి ఆవాహనాది షోడశోపచారములచే పూజించి ఆమంట పమున సువర్ణముచే చేయింపఁబడిన శనైశ్చరుని ప్రతిమను కలశముపై నుంచి గంధ పుష్పాక్షతములతోను వస్త్రాభరణాదులచేతను షోడశోపచారములు సమర్పించి షడ్రసోపేతములగు పంచభక్ష్యోపేతముగా నివేదనముచేసి పలువిధముల భక్తి శ్రద్ధా పూర్వకముగా ప్రార్థించి, బ్రాహ్మణులను భోజనపానీయములచేతను, దక్షిణ తాంబూలాదులచేతను తృప్తిపఱిచిరి. అందుచే నా సూర్యపుత్రుఁడు మిగులసంతుష్టి నొంది, ఆరాజదంపతులకు అంతరాళమున పలువురు సూర్యులను బోలు తనతేజో రూపమున దర్శమిచ్చి యిట్లానతిచ్చెను. "ఓనృపోత్తమా! నీభక్తిపరవశతకు మెచ్చి ప్రసన్నుఁడనైతిని. కోరినవర మిచ్చెదను వేఁడికొనుము" అనఁగా విని యద్భుతా నందములఁ బొందిన యావధూవరులిట్లు విన్నవించికొనిరి. "ఓగ్రహరాజా! నాశత్రు వులు నాచే హతులగునట్లును, నారాజ్యసంపదలు నాకు మరల లభించునట్లును, అనుగ్రహింపుము" అని వినయపూర్వకముగా ప్రార్థింపఁగా "తథాస్తు" అని యాన తిచ్చి ఆగ్రహరాజు అంతర్హితుఁడయ్యెను.

### శని గ్రహమగుట.

అనంతరము శనిని జూచి "నీవు నవగ్రహములలోఁ జేరుదువుగాక. నీవు జన్మించిన కాలవిశేషమునుబట్టి నీదృష్టి మిగుల క్రూరమైనది గాన అది యెవరిపై బ్రసరించునో వారిని నాశనము చేయును" అనెను. రేవతుఁడు గుహ్యకులకు రాజయ్యెను.

తపతీకన్యకను జూచి "అమ్మాయీ! నీగర్భమున సంవర్తకుని వలన పుత్త్రుఁ డుదయించును. ఆబాలునికి కురు అని పేరగును. అతఁడు ఏడవమనువు కాలమున నీపృథివికి చక్రవర్తియై ప్రసిద్ధిగాంచును. వాని సంతతివారు పేరుప్రతిష్ఠలుపొందు దురు. వారినామములు దేవతలు ఋషులు మునులు కీర్తింతురు" అని చెప్పెను.

తరువాత భాస్కరుఁడు ఛాయాదేవివైపు దిరిగి కోపదృష్టితోఁ జూడఁగా ఆమెను క్షమింపుమని సంజ్ఞాదేవి ఆయనను ప్రార్థించెను, అది మొదలు ఛాయ

సంజ్ఞాదేవివద్ద చెలికత్తెగా నుండెను. అని చెప్పఁగా విని పార్వతి శివునిఁ జూచి యిట్లు ప్రశ్నచేసెను. "నాథా! యమునికి రాజధానియగు సంయమనీపుర మెట్టిదో వర్ణించి చెప్పఁడు"

శని మందగామి.

అనంతరము గిరిజ ఈశ్వరుని జూచి "స్వామీ! శనిదృష్టి క్రూరమైనదని సెలవిచ్చితిరి. అది యెవరి నెట్లు బాధించినదో సెలవియ్యవలయును." అని యడుగఁగా సదాశివుఁడిట్లు ఆమెతోఁజెప్పెను. "ఓసఖీ! వినుము. ఆదిత్యునికి ఛాయాదేవియందు జనన మొందిన బాలునికి శనైశ్చరుఁడనిపేరు. అది యతనికి సార్థకనామము. ఏలయన, నతఁడు అతిమందముగా నడచును, తనతండ్రి ముప్పది దినములలో నడచు కాలచక్రమునందలి ఒకరాశిని ముప్పదిమాసములలోను దివాకరుఁడు ఒకసంవత్సరమున తిరిగివచ్చు పండ్రెండు రాసులను ముప్పదివత్సరములలోను శనైశ్చరుఁడు దాఁటఁగలుగును." అనఁగా విని పార్వతి యిట్లు ప్రశ్నచేసెను. "నాథా! శనిసూర్యులకు గమనమునొకటిగాదా అట్లుగాదు? సూర్యుఁడు నెల 1 కి 30 దినముల చొ॥ పండ్రెండు రాసులను సంచరించును, ఆకాలమే భగణమనఁబడుననియు చెప్పుదురు? శీఘ్రమంద గతులు. వానిని వివరముగాఁజెప్పి నాసంశయమును దీర్పఁడు" అని యడుగఁగా ఈశ్వరుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

సశేషము ముందు పంచాంగములలో చూడగలరు.

శనిశాంతి మొదలగు విశేషములు తెలియవలెననే వారందఱు నవగ్రహశాంతి విధానమనె గ్రంథమందు జూడగలరు.

నవగ్రహ శాంతివిధానము 0—4—0

ఆర్యానంద ప్రెస్, } బచ్చుపేట, మచిలీపట్టణము.

## మేషలగ్నజాతకునకు.

౫ స్థానాధిపతి రవియు. ౯-౧౨ స్థానాధిపతి గురుడు, వీరిరువురు, శుభకరులు ౧౦-౧౧ స్థానాధిపతిశని, 3-౬ స్థానాధిపతిబుధుడు ౨-౭ స్థానాధిపతి శుక్రుడు. వీరుముువ్వురు పాపులు, భాగ్యాధిపతియయిన గురునకు రాజ్యలాభాధిపతి యయినశనితోడసంబంధముగలిగనేని రాజయోగ కరత్వంబు గలుగక పోవడమెగాక నైజంబైన శుభత్వంబులుప్తంబై పాపత్వంబు సంభవంబగును, అదిఎట్లన్నను, భాగ్యాధిపతికి అష్టమాధిపత్యము రాజ్యాధిపతికి లాభాధిపత్యము వచ్చెనేని తత్సంబంధముచేత రాజ యోగంబు గలుగ నేరదు, ౪ స్థానాధిపతి చంద్రుండు, ౧-౮ స్థానాధిపతి, కుజుడు, వీరిరువురు లాక్షణికులు ఉభయమారకాధిపతియగు శుక్రుండు మారకుండుగాడు శని మొదలయిన పాపులు మారకలక్షణలక్షితులగుచున్నచో మారకము నిచ్చెదరు,, మారక ద్వయమాశ్రిత్య మారకో నతుమారకః,, అని చెప్పంబడియున్నది గావున నుభయ మారకాధిపత్యము గలిగినగ్రహముస్వతంత్రముగా మారకమునిచ్చువాడుకాడు,

## వృషభ లగ్నజాతకునకు.

(౪)స్థానాధిపతి సూర్యుడు౨-౫ స్థానాధిపతి సౌమ్యుడు, వీరిద్దఱుశుభకరులు, ౯-౧౦ స్థానాధిపతిశని రాజయోగి, ౮-౧౧స్థానాధిపతి గురుడు ౧-౬ స్థానాధిపతిశుక్రుండు, 3వస్థానాధిపతిచంద్రుండువీరుముగ్గురుపాపులు, ౭-౧౨ స్థానాధిపతికుజుడు లాక్షణికుండై హననంబు చేయడు జీవాదిపాపులు మారకలక్షణ లక్షితులయి మారకముచేయుదురు

## మిధునలగ్న జాతకునకు

౫-౧౨ స్థానాధిపతిశుక్రుండెశుభుడు ౬-౧౧ స్థానాధిపతిఅంగారకుడు, ౭-౧౦స్థానాధిపతిగురుడు3స్థానాధిపతి రవియు వీరుముువ్వరు పాపులు,౮-౯ స్థానాధిపతిశనియు ౭-౧౦ స్థానాధిపతి గురుడు వీరిద్దరుకూటమి జెందిరేని యోగభంగంబై యశుభంబుగలుగును ౨ వస్థానాధిపతిచంద్రుండు ఇతండుమారకుండుగాడు భౌమాదిపాపులుమారకధ్వజులై హననంబు చేయుదురు, ౧-౪ స్థానాధిపతిబుధుడు తటస్థలక్షణంబు గలవాడనుట.

కటకలగ్న జాతకునకు.

౫-౧౦ స్థానాధిపతికుజుండొక్కండె రాజయోగకారకుండు, ౬-౯ స్థానాధిపతి గురుడు శుభుడు, ౩-౧౨ స్థానాధిపతిబుధుడు౪-౧౧ స్థానాధిపతి శుక్రుండువీరిరువురునశుభులుతనుస్థానాధిపతిచంద్రుడు ౭-౮ స్థానాధిపతిశనియు, ఈయిద్దరున్నూలాక్షణికులు ౨వస్థానాధిపతి సూర్యుడు, భార్గవాది పాపులు హింసాకార్యంబు చేయజాలుదురు.

సింహలగ్న జాతకునకు

౪-౯ స్థానాధిపతి కుజుడు యోగి, ౫-౮ స్థానాధిపతిగురుడులగ్నాధిపతి రవియు వీరిరువురు శుభకరులు ౨-౧౧ స్థానాధిపతి బుధుడు, ౩-౧౦ స్థానాధిపతిశుక్రుడు, ౧౨వస్థానాధిపతి చంద్రుడువీరుమువ్వురు పాపులు ౬-౭ స్థానాధిపతి శనైశ్చరుడు లాక్షణికుండు మందాదులు హంతృలక్షణంబుగలిగి హననంబు చేయుదురు.

కన్యాలగ్న జాతకునకు.

౨-౯ స్థానాధిపతిశుక్రుడువీడొక్కండె శుభకరుండు, ౧-౧౦స్థానాధిపతి సౌమ్యుడు ఇతడు కేంద్రాధిపత్యముచే దోషియయినప్పటికి, భాగ్యాధిపతిశుక్రునితో సంబంధించెనేనిరాజయోగంబు ప్రాప్తంబగును ౩-౮ స్థానాధిపతి. కుజుడు, ౪-౭ స్థానాధిపతి గురుడు ౧౧ వస్థానాధిపతి చంద్రుడు వీరుమువ్వురు పాపులు౧౨ వస్థానాధిపతి భాస్కరుడు ౫-౬ స్థానాధిపతి శనియున్నూ వీరుమువ్వురు లాక్షణికులు, కుజుడు మొదలగు పాపులు మారకస్థితులైనచోమారకంబు చేయుదురు,

తులాలగ్న జాతకునకు.

౪-౫ స్థానాధిపతి శనైశ్చరుడు, ౯-౧౨ స్థానాధిపతి బుధుడు, వీరిరువురుశుభకరులు ౧౦వ స్థానాధిపతి చంద్రుడు, భాగ్యేశ్వరుండైన బుధుడు గలసిరేని రాజయోగంబివ్వనోపుదురు ౩-౬ స్థానాధిపతి గురుడు ౧౧ వస్థానాధిపతి దివాకరుడు, ౨-౭ స్థానాధిపతి భూపుత్రుడు వీరు ముగ్గురు పాపులు, లగ్నాధపతి శుక్రుడు ఉదాసీన భావంబు గలవాడు ఉభయమారకేశ్వరుండగుకుజుడు హంత్యకార్యంబుసేయడు, గుర్వాది పాపులు హింసకు లగుదురు.